T.J. Ravi Kumar

# వీరమల్లుడు

## సాహసాలు

బాలల బొమ్మల జానపద
సాహసిక నవల



రచన:

సీతంరాజు



బాలసాహిత్యం :
బుక్ నెం : 15

*

వెల : 120 పైసలు

*

ముఖ చిత్రం :
బొమ్మలు :
శ్రీ వి. ఎస్. ప్రకాష్

*

ముద్రణ:
శ్రీ 'వెంకటరమణ'
విజయవాడ - 2.

## ముందుమాట

(మా)మీ 'బాలసాహిత్యం' బుక్స్ పాఠకులను ఆకర్షిస్తున్నాయ్!— కథలు, నవలలు చాలా బాగుంటున్నాయి. బొమ్మలుకూడా పసందుగా వుంటున్నాయి. మంచి "చిల్డ్రన్ బుక్స్"గా పేరుంది- అంటూ మాకు ఉత్తరాలు వస్తున్నాయ్!- అందుకు మా పాఠకులకు ధన్యవాదములు.

ఈ నవల "వీరమల్లుడు సాహసాలు" ఓ బాలుని కథ. జీవితంలో — చిన్నతనంలో జరిగిన - ఓ సంఘటనను దృష్టిలో పెట్టుకొని పట్టుదల, కార్యదక్షత, ఓర్పు, నేర్పులతో అనేక సాహస కృత్యాలు చేసి తాను కోరుకున్న గమ్యస్థానం చేరతాడు.

ఇక చదవండి—

శైలవ్
పబ్లిషర్స్.

Published By J. RAJGOPAL
For Bala Sahityam, VIJAYAWADA 3

# వీరమల్లుడు

## సాహసాలు

రచన: శ్రీశంరాజు

వీరమల్లుడు జయంతి నగరంలో పేద కుటుంబంలో జన్మించాడు. పుట్టుకతోనే తల్లిని పోగొట్టుకున్నాడు. అప్పటినుంచి తండ్రి చేతులమీదుగానే పెరుగుతున్నాడు.

పుట్టుకతోనే తల్లిని పోగొట్టుకున్న ఆ పిల్లవాడంటే అంతా అసహ్యించుకోవటం మొదలుపెట్టారు. దానికి తగ్గట్లు అల్లరివాడుగా తయారయ్యాడు. ఎవ్వరూ దగ్గరకే చేరనిచ్చేవాళ్ళుకారు. అసలు మాట్లాడరు. తండ్రి మాత్రం గారాబంతో ప్రాణసమంగా పెంచుకుంటున్నాడు.

వీరమల్లుడు తండ్రి గోపయ్యమల్లుడు. కష్టపడి సంపాయించటం, సంపాదించిన దాంతోనే ఇంతో అంతో గంజి త్రాగి తృప్తిపడటం, సూర్యోదయముతోనే సమీపానున్న అడవికిపోయి, కట్టెలు కొట్టుకురావటం, అవి అమ్ముకోవడం నిత్యకృత్యంగా పెట్టుకున్నాడు. యీ సందర్భంలో వీరమల్లుణ్ణి ప్రేమించటంవల్ల అతను కోరింది తెచ్చి యివ్వటం వరకేగానీ, అతని భవిష్యత్తుకి తను చేయాల్సిన కృషిని గురించిగానీ యోచించేవాడు కాదు గోపయ్యమల్లు. తనేమో! తన వృత్తేమో! తనవరకే కష్టాన్ని పెట్టుకొనేవాడు.

వీరమల్లుడికి పన్నెండో ఏడు వచ్చింది. డొక్క పొడిచినా అక్షరం ముక్క లేకుండా పోయింది. చదువుకొమ్మని స్కూలుకు పంపితే, తోటి కుర్రాళ్ళతో పిచ్చి దెయ్యం కథలు చెప్తుండేవాడు. మాష్టారు కేకలువేసే



వారు. చదువుకోవాలన్న అభిలాష అతనిలోనూ లేదు. చెప్పించాలని ప్రయత్నంచేసి, తండ్రి గోపయ్యమల్లు విసుగెత్తిపోయాడు.

తండ్రి గారాబం ఎక్కువవటంవల్ల వీరమల్లుడిలో సోమరితనం, అల్లరి ఎక్కువయ్యింది. బడికివెళ్ళే పిల్లల్ని వెళ్ళనీయకుండటం, వాళ్ళ చేతుల్లోని తాటాకు పత్రాల్ని నిరంకుశత్వంగా లాగి యే కాలువల్లోనో, మురుగ్గుంటల్లోనో పారవేయటం, అస్తమానం చెట్లెక్కి కోతికొమ్మచ్చి,

గూడుంబిళ్ళ ఆడటం, కాలవల్లో పడి యీదటం—

తనకు తినాలని అనిపించినవి, తాను కావాలనుకున్న ఫలాలను యెవరి పెరట్లో వున్నా సరే గభాల్న గోడలు దూకి కోసుకొని తినటం, మిగిలినవి ఆ పెరడంతా విరజిమ్మటం ఇటువంటి యెన్నో రకాలయిన



అల్లరి పనులన్నీ తోటి స్నేహితులతోకలసి చేస్తోండేవాడు. ఆ గ్రామ ప్రజలందరికీ పసితనంలోనే విరోధిగా అయ్యాడు వీరమల్లుడు.

తన కొడుకును మందలించి మంచి మార్గంలో పెట్టుకోకపోతే

తండ్రి గోపయ్యమల్లుని, పుత్రుడు వీరమల్లుణ్ణి కూడా గ్రామ బహిష్కరణ చేయబడుదు రని గ్రామాధికారులు గోపయ్యమల్లుణ్ణి పిలిపించి హెచ్చరించారు. అంతవరకు వీరమల్లుణ్ణి గురించి పట్టించుకోని గోపయ్యమల్లుడికి తన కొడుకు దుండగాలని గురించి, వాటిని ఆపే మార్గంకోసం అనేక విధాల యోచించాడు. అనేక రకములయిన ప్రయత్నములు చేశాడు. కానీ వీరమల్లుడిలో మార్పు తేలేకపోయాడు.

వీరమల్లుడికి విద్యాబుద్ధులు చెప్పమంటే యే గురువూ అంగీకరించేవాడుకాదు. దగ్గరకు చేరనియ్యటంలేదు—పన్నెండు సంవత్సరాలు పైన పడ్డా చదువురాని శుంఠంగా తయారయినాడు.

అల్లరి పనులు దినదినానికి ఎక్కువవుతున్నాయిగాని తగ్గటంలేదు. తను యెంత ప్రయత్నించినా లాభం లేకపోయింది. క్రమేపి తనలోవున్న ఆశ నశించి, తనకి మనోవ్యాధిగా వీరమల్లుడి విషయం పట్టి పీడించ సాగింది.



ఇంత మనోవ్యాధితో మంచం పట్టిన గోపయ్యమల్లుడికి క్రమేపి శక్తి సన్నగిలింది. చావు బ్రతుకులమధ్య పడి కొట్టుకుంటున్న అతడిని చూసే నిమిత్తమయినా తన కొడుకు వస్తాడను కొన్నాడు.

కడసారిగా కొడుకును చూడాలన్న అభిలాష ఎక్కువయింది. లేని ఓపిక తెచ్చుకుంటూ నెమ్మదిగా లేచి అవతలగా మూలనున్న కర్ర పట్టుకొని

వుండుండొకసారి పొడిగా దగ్గుతూ, అడుగులో అడుగు వేసుకుంటూ బయల్దేరి బయటకు వచ్చి, యింటికి తాళం పెట్టి వీధిలో అడుగుపెట్టి తల పైకెత్తి చూశాడు గోపయ్యమల్లు.

అతని ఆనందానికి అంతులేదు. యే పుత్రుని కోసమయితే ఎదురు తెన్నులు చూశాడో, ఏ తనయుణ్ణయితే చూడాలన్న అభిలాషతో ఆరాట పడుతున్నాడో, తన కుమారుడు అప్పుడే గబ గబా యింటివేపు నడిచి వస్తున్నాడు. ఆ బాలుని ఆకారం విచిత్రంగా కనిపించింది. దుస్తులు బురద కొట్టుకొని ఉన్నవి. ఒళ్ళంతా బురద. అతని ఆకారం బట్టి చూస్తుంటే ఎవరితోనో తగవు లాడివస్తున్నట్లు అనిపించింది. అతని నడకలో వున్న తొందర, చూపుల్లో వున్న భయం గోపయ్యమల్లుకి కూడా ఏదో తెలియని భయాన్ని రేకెత్తించింది.

"అయ్యా!" ఎదురుగా వస్తున్న తండ్రి చేయి పట్టుకొంటూ ఎందుకో వెనక్కి తిరిగి చూశాడు వీరమల్లుడు.

"ఇంతకాలానికి వచ్చావురా అబ్బీ! ఇప్పుడు గుర్తుకొచ్చాన్రా యీ ముసలితండ్రి! నన్ను ఇలా వదిలేస్తే నాకు ఇంక గతి ఎవర్రా అబ్బీ!" గట్టిగా కౌగలించుకొని కంటతడి పెట్టాడు గోపయ్యమల్లు.

"అయ్యా! ముందు నన్ను ఎవరికీ కనబడకుండా దాచెయ్యాలి! నన్ను పట్టుకోడానికి రాజభటులు వస్తున్నారు." అంటూ తండ్రిమాటలు వినిపించుకోకుండానే కంగారుగా మళ్ళీ వెనక్కి తిరిగి చూశాడు వీరమల్లుడు.

"రాజభటులు నిన్ను పట్టుకోడానికి వస్తున్నారా? నువ్వేం తప్పు చేశావురా అబ్బీ!" ఆదుర్దాతో అని వీధివేపు కంగారుతో చూశాడు.

"రాజకుమారుడు నగరం బయట కొలనువద్దకు ఆడుకోడానికి వచ్చాడు. నేనూ ఆ జట్టులోనే ఆడుకుంటున్నాను. ఆటలో రాజకుమారుడు ఓడిపోయాడు—అతన్ని ఉడికిలించాను. అతను మట్టి ఉండలతో, బురదతో



నన్ను కొట్టాడు—నేను అతన్ని అక్కడ ఉన్న కాలువలోనికి బలంగా తోశాను. అప్పటికప్పుడే ఎక్కడనుండి వచ్చి పడ్డారో రాజభటులు వచ్చి నన్ను పట్టుకుని మహారాజు ఎదుట నిలబెట్టారు. తన పుత్రుడు చెప్పిందే నిజమని నమ్మి, నన్ను బంధిఖానాలో వేయించాడు మహారాజు." వగరుస్తూ చెప్పుతూ ఆగాడు వీరమల్లుడు.

"ఎంతపని జరిగిందిరా అబ్బి" పొంగిపొర్లే దుఃఖం అణచుకుంటూ అన్నాడు గోపయ్యమల్లు.

"అంతేనా అయ్యా! యింకా వుంది, ఎవ్వరూ చూడకుండా సమయం కనిపెట్టి తప్పించుకొని పారిపోయి వచ్చాను. మార్గమధ్యంలో కొందరు భటులు నన్ను గుర్తుపట్టి పట్టుకోవాలని వెంబడించారు. వాళ్ళకు చిక్కకుండా తప్పించుకొని వచ్చేశా?" అంటూనే మరోసారి వెనక్కి తిరిగి చూసేవరికి రాజభటులు గుర్రాలమీద ప్రత్యక్షమయ్యారు. వాళ్ళను చూస్తూనే వీరమల్లుడికి నోటివెంట మాటరాలేదు. భయంతో వణ్కి కంపించిపోయింది—దీనంగా భటుల్ని, తండ్రినీ మార్చి మార్చి చూశాడు.

"రాజభటుల రాకకు...."

"కారణం! యీ కుర్రవెధవ తప్పించుకొని పారిపోయి రావటమే!" మీసం సవరించుకొని గోపయ్యమల్లు మాటకు అడ్డుతగులుతూ అంటూ వీరమల్లు చెయ్యి పట్టుకున్నాడు- గుర్రంమీదనుండి గభాల్న దూకిన ఒక భటుడు. వీరమల్లు భయపడుతూనే తండ్రిని దీనంగా చూసి వల వలా యేడ్వసాగాడు.

భటులు క్రోధావేశులై వీరమల్లు రెక్కలు విరిచి కట్టి గుర్రంమీద ఎక్కించబోతుండగా, గోపయ్యమల్లు అడ్డుగా వచ్చి బ్రతిమిలాడాడు.

వాళ్ళు వినలేదు.

గోపయ్యమల్లు బ్రతిమిలాడటం మానలేదు.

భటుల కాళ్ళు పట్టుకు యాచించాడు.

భటులు కోపంతో అతన్ని గట్టిగా తన్నారు.

మరో భటుడు తన వద్దనున్న కొరడాతో గట్టిగా మోదాడు గోపయ్యమల్లుని.

అసలే మనోవ్యాధితో కూలుగుతూ కృశించిపోయిన వృద్ధుడు గోపయ్యమల్లుడు భటుల నిరంకుశత్వానికి అప్పటికప్పుడే ప్రాణాల్ని విడిచి పెట్టాడు.

"అయ్యో!" గొంతు పగిలేలా అరుస్తూ ఒక్క ఊపున భటుల బారినుండి విడిలించుకొచ్చి తండ్రిమీద పడి వల వలా యేడ్చాడు వీరమల్లుడు. అప్పటికే తన తండ్రి చనిపోయాడని తెల్సుకొన్నాడు.

తండ్రి శవం మీదపడి వున్న వీరమల్లుడిని బలంగా రెండు కొరడా దెబ్బలుకొట్టి గుర్రంమీద ఎక్కించుకున్నారు. అంతలో అతను చూస్తూండగానే దారికి అడ్డుగా ఉన్న గోపయ్యమల్లు శరీరాన్ని కాలితో పక్కకు నెట్టాడు మరో భటుడు. ఆ సంఘటనను చూసిన వీరమల్లుడుకి కోపం కట్టలు త్రెంచుకొని వచ్చింది. ఆ భటుణ్ణి ఒక్క దెబ్బతో చంపాలను కున్నాడు. కానీ యేం చేయగలడు? తాను బాలుడు. అందులోను చేతులు

నవ్వి, మీసం సవరించుకుంటూ గర్వంగా యువరాజు జగత్‌సింగ్‌ను చూస్తూ—

"యువరాజా! నిందితుణ్ణి మీ యిష్టం వచ్చినట్లు విచారణచేసి సరియైన శిక్ష విధించాల్సిందిగా కోరుతున్నాను" అన్నాడు మదన్‌సింగ్.



"అలాగే నాన్నగారూ!" లేచి నిలబడి, పొడిగా దగ్గి వీరమల్లుణ్ణి చూశాడు.

"నన్ను పంట కాలువలోకి పడద్రోయటం నేరమా! కాదా!" సూటిగా ప్రశ్నించాడు జగత్‌సింగ్.

వీరమల్లుడు ఏదో ఆలోచనతో రెప్పవాల్చకుండా చూస్తూ, కంటి వెంట నీరు కారుస్తూ నిలబడివున్నాడు. యువరాజు ప్రశ్నకు సమాధానం

నవ్వి (మీసం సవరించుకుంటూ గర్వంగా యువరాజు జగత్‌సింగ్‌ను చూస్తూ—

"యువరాజా! వందితుణ్ణి మీ యిష్టం వచ్చినట్టు విచారణచేసి సరియైన శిక్ష విధించాల్సిందిగా కోరుతున్నాను" అన్నాడు మదన్‌సింగ్.



"అలాగే నాన్నగారూ!" లేచి నిలబడి, పొడిగా దగ్గి వీరమల్లుణ్ణి చూశాడు.

"నన్ను పంట కాలువలోకి పడద్రోయటం నేరమా! కాదా!" సూటిగా ప్రశ్నించాడు జగత్‌సింగ్.

వీరమల్లుడు ఏదో ఆలోచనతో రెప్పవాల్చకుండా చూస్తూ, కంటి వెంట నీరు కారుస్తూ నిలబడివున్నాడు. యువరాజు ప్రశ్నకు సమాధానం

ఇవ్వటానికిగానీ, అతను వేసే ప్రశ్నలు వినటానికిగానీ ప్రయత్నిస్తూ వున్నట్లు కనిపించటంలేదు—సభాసదులు అంతా ఒకరి నొకరు చిత్రంగా చూసుకొన్నారు.

"నిన్నే!" సభ ప్రతిధ్వనించేలా గట్టిగా అరిచాడు మళ్ళీ జగత్ సింగ్—

"ఏమిటది?" తేరుకొని అడిగాడు వీరమల్లుడు.

"నన్ను పంట కాలువలోనికి పడద్రోయటం నేరం అవునా, కాదా? అని అడిగేను" అంటూ మళ్ళీ అడిగాడు జగత్ సింగ్.

"ఆటల్లో చేసిన మోసాన్ని బట్టి చూస్తే నేరం కాకపోయినా, శారతమ్యాలు లేకుండా కాలవలోకి తోయటం నేరమేనని వప్పుకుంటున్నాను" జవాబుగా అన్నాడు వీరమల్లుడు—



"ఆటల సంగతి ఇక్కడ అనవసరం. పడతోయటం నేరమేనని వప్పుకున్నావ్. అంతే చాలు" అని "యింకా" అంటూ జగత్ సింగుని చూశాడు మహరాజా మదన్ సింగు.

"బంధిఖానాలో నుండి తప్పించుకు వెళ్ళటానికి కారణం?"

"నా రాక కొరకు ఎదురుచూసే తండ్రికి కనుపించి సెలవు తీసుకు రావడానికి" అన్నాడు వీరమల్లుడు.

"ఆ కోరిక మమ్మల్ని అడిగి తీర్చుకో వచ్చుగా!" అన్నాడు మధ్యలో మహామంత్రి.

"అడిగితే అంగీకరించరని తెలియదా మహామంత్రీ! ఇక్కడికి భటుల్ని అడిగాను. లాభం లేకపోయింది."

"ఎలా తప్పించుకు పారిపోయావ్?" ఆశ్చర్యంతో ముందుకువంగి అడిగాడు మహారాజు మదన్‌సింగ్.

"దొంగలకు రొట్టెలు తెచ్చాడు ఒక భటుడు. అతనితో నా పరిస్థితి అంతా చెప్పాను-అతను జాలిపడి నాకు సహాయం చేశాడు."

"ఏ విధంగా?" అడిగాడు యువరాజుగా నిలబడిన బాలుడు జగత్‌సింగ్.

"రొట్టెల బుట్టలో నన్ను కూర్చుండబెట్టుకొని ఎవరూ చూడకుండా ఆ బుట్టను యథావిధిగా తలమీద పెట్టుకొని బయటకు తీసుకువెళ్ళి విడిచి పెట్టాడు!" అన్నాడు వీరమల్లుడు —

"ఆ భటుడు పేరేమిటి?" మహారాజు అడిగాడు.

"పేరు చెప్పి అతని ప్రాణం మీదకు తీసుకొచ్చేటంత అమాయకుణ్ణికాదు నేను. నేను ఎలాగూ ఫలితం అనుభవించాలి. అతన్నికూడా ఈ నరక యాతనకు గురిచేయటం నాకు ధర్మముకాదు. అలా ఎప్పుడూ చేయను!" ఖచ్చితంగా అన్నాడు వీరమల్లుడు.

"నిన్ను విడిచి పెడతాం! అప్పుడన్నా చెపుతావా?" అడిగాడు మహారాజు మదన్‌సింగ్.

"చెప్పను! మీ మాటలు నమ్మటంకూడా మంచిదికాదు! మీది నిరంకుశ పరిపాలన! మిమ్మల్ని నమ్మిన వాళ్ళకు నష్టమేగానీ, లాభం కూడా వుంటుందా?" ప్రక్కగా చూసి అన్నాడు వీరమల్లుడు.

"మోడి నిరంకుశ పరిపాలన అని ఎలా తెల్సుకున్నావ్?" అడిగాడు మహామంత్రి.

"చెప్పమంటారా మహామంత్రీ! తప్పించుకు పోవటం నా నేరం కావచ్చు! అది అడ్డుపెట్టుకొని నన్ను బంధించి తీసుకు పోవద్దని అడ్డు



వచ్చిన నా తండ్రిని కొరడాతో బాది, కాలితో ప్రక్కకు నెట్టటం నిరంకుశ పరిపాలన అవునా కాదా!" సూటిగా చూసి అడిగాడు వీరమల్లుడు.

"ఆ సంగతి మాకు యింతవరకూ తెలియదే!" తెల్లబోయి అన్నాడు మదన్‌సింగ్.

"తెలిసినప్పటికీ అది నేరం కాదని నా అభిప్రాయం!" అన్నాడు జగత్‌సింగ్.

"ఎందు వలన?" సూటిగా అడిగాడు వీరమల్లుడు.

"ముసలి వెధవలు బ్రతకడం దేశానికి అరిష్టం!" అని తండ్రిని చూశాడు జగత్‌సింగ్.

కుమారుడు చెప్పింది వినేసరికి నడుం విరిగినంత పనయింది మహారాజు మదన్‌సింగ్‌కి. క్షణం ఏమీ మాట్లాడలేక కళ్ళప్పగించి యువరాజుని అదోలా చూశాడు. కారణం, తనకూ వయస్సు మీరి ఉండటంవలన. ఆ వెంటనే తేరుకుని చిన్నగా నవ్వాడు. "మా యువరాజు చాతుర్యంగా మాట్లాడుతాడే! ఆహ్హా!" అంటూ మంత్రిని చూశాడు మదన్‌సింగు.

"అవునవును" తనకూ వయస్సుమీరి ఉండటంవలన యువరాజు జగత్‌సింగు మాటలు సమంజసంగా ఉండకపోయినా పైకి అలా అన్నాడు మహామంత్రి.

"ప్రభువులు అలా సెలవిస్తే నేను కాదనేది మాత్రమేముంది?" నెమ్మదిగా అన్నాడు వీరమల్లుడు.

"ఒప్పుకున్నందుకు సంతోషం. పోతే, నిన్ను విడిచి పెట్టటానికి అంగీకరిస్తాను! కానీ, నీకు సహాయం చేసిన భటుడిని కనీసం గుర్తించగలవా!" అన్నాడు మహారాజు మదన్‌సింగు.

"అంతటి మహోపకారం చేస్తానంటే నేను కాదనగలనా?" నవ్వి తన ప్రక్కన కొంతదూరంలో నిలబడివున్న భటుణ్ణి ఎవరూ పసికట్టకుండా క్రీగంటగా చూశాడు వీరమల్లుడు.

ఆ భటుడు కొంచెం కంగారు పడుతూనే 'రహస్యం బయటపెట్టవద్ద'న్నట్లుగా దీనంగా చూశాడు – అతని చూపుల్లోని భావాన్ని గుర్తించకుండానే—

"మహారాజా! నాకు సహాయం చేసిన భటుణ్ణి గుర్తించగలను. యిక్కడే వున్నాడు—ముందు నా సంకెళ్లు తొలగించే యేర్పాటు చేయండి—స్వయంగా ఆ భటుణ్ణి మీ వద్దకు తీసుకొచ్చి నిలబెడతాను. ఆ తర్వాత దయవుంటే నన్ను విడిచిపెడ్దురుగాని"—అడిగాడు వీరమల్లుడు.

క్షణం ఆలోచించి యువరాజు జగత్‌సింగుకి ఏదో సైగచేసి "ఆ బాలుణ్ణి బంధ విముక్తుణ్ణి చేయండి" అని తీపగా అన్నాడు మహారాజు మదన్‌సింగు.

భటులు అతనికి కట్టిన యినుప గొలుసులను వూడదీశారు. వీరమల్లు అందర్నీ మార్చి మార్చిచూస్తూ నెమ్మదిగా అడుగులేస్తూ తనకు సహాయం చేసిన భటుణ్ణి సమీపించి, గభాల్న ఆ భటుని బొడ్డుదగ్గర వ్రేలాడే "ఖైజార్" తీసి మహారాజు మదన్‌సింగు మీదకు విసిరాడు.

"ఆఁ!" అంటూ కంగారుగా తప్పించుకోబోయాడు. కానీ ప్రయత్నం పూర్తిగా ఫలించనందున ఆ "ఖైజారు" తిన్నగా దూసుకెళ్ళి మహారాజు మదన్‌సింగు భుజానికి తగిలి గాయపర్చింది - కోపోద్రిక్తులైన భటులు వెంటనే వీరమల్లుని పట్టుకొని బంధించారు.

"ద్రోహీ! ఎంత పని చేశావురా నీచుడా!" అప్పటికప్పుడే ఉగ్రుడై కోపంతో అడుగు ముందుకివేసి అన్నాడు యువరాజు జగత్‌సింగు.

"నేను చేసిన పని మంచిదే! ముసలివాళ్ళు బ్రతకకూడదని యింత క్రితమేగా మీరు చెప్పారు - దాన్నిబట్టి ఆలోచిస్తే మీ ముసలి తండ్రి బ్రతకటంకూడా మంచిదికాదు కదా" నిర్లక్ష్యంగా అన్నాడు వీరమల్లుడు.

"షేర్మయ్!" గట్టిగా అధికార స్వరంతో అంటూ తండ్రిని సమీపించి, దెబ్బ తగిలిన చోట చేయిపెట్టి "నాన్నగారూ!" అన్నాడు.

మహామంత్రిని చూస్తూ "రాజవైద్యుల్ని వెంటనే పిలిపించండి!" అన్నాడు యువరాజు జగత్‌సింగు.

తన భుజంమీద జలతారు కండువా రెండుగా చించి తాత్కాలికంగా కట్టు కట్టాడు మహామంత్రి.

భటులు వెంటనే ఆంగారుగా పరుగెత్తారు రాజవైద్యుల కొరకు___

"అన్ని సౌకర్యాలూ వున్నాయి కనుక దెబ్బ తగలగానే చికిత్స చేయించటానికి ప్రయత్నిస్తున్నారు! నా తండ్రికి అవ్వేమీ లేకపోవటం వలన మీ భటులు చేసిన అఘాయిత్యాలకి తలవంచి ప్రాణాలు విడిచాడు. పితృప్రేమ అందరికీ సమానమేనని యిప్పటికైనా తెల్సుకో! దగ్గరున్నారు కాబట్టి రాజవైద్యుల్ని పిలిపించి మీ తండ్రికి చికిత్స చేయించటానికి

ప్రయత్నిస్తున్నారు. ఇనుప గొలుసులతో బంధింపబడి వున్నాను కనుక నా తండ్రి కళేబరాన్ని భటులు కాలితో ప్రక్కకు నెట్టినా కన్నీళ్ళు మ్రింగి కుమిలిపోయాను! యిప్పటికైనా—"

అపుడు భుజానికి గాయమైనను, బాధను లెక్కచేయక మహారాజా మదన్‌సింగు—

"తెలిసింది కుర్రవాడా! తెలిసింది — పితృప్రేమకు తారతమ్యా లుండవు - అన్యాయాన్ని అరికట్టడంలో అంతస్తులు అడ్డురావు. నీ బుద్ధి కుశలతకు మెచ్చుకొన్న కారణంగా నిన్ను విడుదల చేస్తున్నాను - యిక నువ్వు స్వేచ్ఛగా" — ఆగి కొద్దిగా బాధపడుతూ తన భుజం పట్టుకుని కళ్లుమూశాడు.

"నాన్నగారూ! వాడు రాజద్రోహి! ఈ మాత్రం"—అని యింకేదో చెప్పబోతున్న యువరాజా జగత్‌సింగుని చూసి ఆపమన్నట్లు చేయి చూపించాడు.

"ఏమయినా అతను బుద్ధిమంతుడు. న్యాయమేదో అన్యాయమేదో తెలుసుకొన్న బాలుడు. అతన్ని విడిచిపెట్టడమే కాదు! నేటి నుండీ యువ రాజా జగత్‌సింగునకు అంగరక్షకుడుగా నియమిస్తున్నాను" - అని సభా సదులందర్ని చూసి, ఆ వెంటనే వీరమల్లుణి చూసి చిన్నగా నవ్వుతూ "బాలుణ్ణి విడిచి పెట్టండి" అధికార స్వరంతో అన్నాడు మహారాజా మదన్‌సింగు.

ఆ వెంటనే—

"బాలకా! యువరాజా అంగరక్షకుడుగా వుండటానికి నీకు సమ్మత మేనా?" ప్రేమగా చూసి అడిగాడు మహారాజా మదన్‌సింగు.

"అంగరక్షకుడు అంటే ఏమిటో, అతని బాధ్యత ఎంతవరకో తెలియని వాడిని. ఆ పదవికి నేను అర్హుడనో, అనర్హుడనో నాకేం తెలి

యదు. అందువలన...." అగ్గి మంత్రిని, మహారాజును మార్చి మార్చి చూశాడు వీరమల్లుడు.

వెంటనే యువరాజు జగత్‌సింగు—

"ఆ మాట అలావుంచు; మనిద్దరి మధ్యా విరోధం ఏర్పడింది. మాకు అంగరక్షకులుగా వుండటానికి నీ వే మాత్రం తగవు" కటువుగా అన్నాడు జగత్‌సింగు.

"యువరాజా!" అన్నాడు మహామంత్రి మధ్యలో.

"అవును మహామంత్రి. వాడికీ నాకూ పోలిక ఎక్కడ? నేను సకల విద్యలూ అభ్యసిస్తున్నాను. వాడు వట్టి శుంఠ. నాకు కత్తిపట్టి పోరాడటం తెలుసు. వాడికి కత్తి పట్టుకునే విధానమే తెలియదు. నాలో ధైర్యం, సాహసం వుంది - వాడు వట్టి పిరికి దద్దమ్మ. ధన, కనక వస్తు వాహనాలు నా సొత్తు. వాడికీ నాకూ పోలిక, పొత్తు ఎక్కడ? అటువంటి దౌర్భాగ్యుణ్ణి నాకు అంగరక్షకుడుగా నియమించటం హాస్యాస్పదం కాదా! అన్నిటా సమర్థుడైన నా అంతటి వాడు నాకు అంగరక్షకుడు కావాలి!" తీవిగా చూసి అన్నాడు జగత్‌సింగ్.

"యువరాజు చెప్పిన మాటల గురించి ఆలోచించాల్సింది ఎంతైనా వుంది" యేదో ఆలోచిస్తూనే అన్నాడు మహామంత్రి.

"అవునన్నట్లు". నెమ్మదిగా తల పంకించాడు మహారాజు మదన్‌సింగు.

అతను అలా బహిరంగ పర్చినందుకు వీరమల్లుడికి సిగ్గు, కోపం మితిమీరి వచ్చినా, అతను పలికినదంతా యదార్థం అనుకొని పెదవి కదిల్చి మాట్లాడలేక తలవంచుకున్నాడు.

దాంతో యువరాజు జగత్‌సింగుకి మరీ లోకువయింది. ఇంకేమేమో నోటికి వచ్చిన విధంగా మాట్లాడి వీరమల్లుడిని హేళన చేశాడు.

"మహామంత్రీ! మన గుర్రాల శాలలో పూడవటం, గుర్రాలకు

మేతపెట్టి, వాటిని కడుగుతూండటం, యీ పనులకు అర్హుడు. వాడికి యిష్టమైతే అలా చేయండి." అతురత అన్నాడు యువరాజు జగత్‌సింగు.

యువరాజు ధోరణి మహారాజు మదన్‌సింగుకి నచ్చలేదు - అయినా పుత్రప్రేమ వలన మందలించ లేకపోయాడు.

"అబ్బాయ్!" అని వీరమల్లుణ్ణి చూశాడు మహారాజు.

"మహారాజా! నాకు ఏ పదవులూ వద్దు! దయవుంచి నన్ను వెళ్ళనివ్వండి" అన్నాడు వీరమల్లుడు.

మహారాజు మదన్‌సింగు మాట్లాడలేకపోయాడు—తనలో తను క్షణం ఆలోచించి యువరాజునీ సభాసదుల్నీ చూసి ఆ వెంటనే "నిన్ను వూరికే పంపటానికి మనస్సు అంగీకరించటంలేదు అందువలన నీకు ఒక అశ్వాన్ని, ఖడ్గాన్ని, కొంత ధనాన్ని బహూకరింప దలచాను. మహామంత్రీ! వెంటనే యేర్పాట్లు చేయించండి" అన్నాడు—

"మహారాజులకు జయము! జయము! రాజవైద్యులు అంతఃపురానికి వచ్చి యున్నారు!" అప్పుడే వచ్చిన భటుడు అని తలవంచాడు.

"ఈ మాత్రం స్వల్పదెబ్బకు రాజవైద్యుల్ని పిలిపించారా!" మంత్రిని, యువరాజుని చూశాడు.

"సరే! వస్తున్నాను" భటుడుతో అని "మహామంత్రీ! మేము చెప్పిన వన్నీ ఆ బాలకునకు యిచ్చి పంపండి" అంటూ సింహాసనంనుండి లేచి క్రిందకు దిగి వచ్చాడు. వీరమల్లుడు చిరునవ్వుతో నమస్కరించాడు.

"బాలకా! నీకు భగవంతుడు తెలివి తేటలు యిచ్చాడు! ఆ తెలివి తేటల్ని సద్వినియోగ పర్చుకోవటంలోనే చూపించాలి నేర్పు, ఓర్పులు. అన్ని జన్మల్లోకి మానవజన్మ పవిత్రమైనది. మానవుడుగా జన్మించిన ప్రతివ్యక్తి తన బాధ్యతను నిర్వర్తించుకోవాలి. అందునా, ముఖ్యముగా సంపాదించాల్సింది విజ్ఞానం. అది వేద పఠనంవలన వస్తుంది! అంచేత నీ తెలివి తేటల్ని సద్వినియోగ పరచుకొని సకల విద్యలూ అభ్యసించి పండితుడుగా ప్రకాశించు నాయనా! ఇవే నా ఆశీస్సులు" అంటూ బాలుని

ముందుకి వచ్చి అతని రెండు భుజాలూ పట్టుకొని అతన్ని ఆశీర్వదించాడు మహారాజు మదన్‌సింగు.

వీరమల్లుడు వళ్ళు జలదరించింది. ఆశగా మహారాజు కళ్ళల్లోకి చూశాడు. మహారాజు చిరునవ్వుతో "అవునన్నట్లు" తల ఆడించాడు. యువరాజు జగత్‌సింగు ఆవేశంతో పళ్ళు బిగించి, కటువుగా చూశాడు.

యువరాజు జగత్‌సింగుని లెక్క చేయకుండా మహామంత్రి రాజాజ్ఞ ప్రకారం వీరమల్లుడికి గుర్రము, ఖడ్గము, వెయ్యి వరహాలూ యిచ్చి సగౌరవంగా సాగనంపాడు.

* * *

వీరమల్లుడు రాజభవనం విడిచి వెళ్ళేసరికి ఒక దొంగల గుంపు అతన్ని చుట్టుముట్టింది। వాళ్ళను చూసి వీరమల్లుడు భయపడలేదు.

"మీరు వచ్చిన పనేమిటి?" అడిగాడు వీరమల్లుడు.

"నీ దగ్గరున్న ధనాన్ని దోపిడి చేయటానికి।" అన్నాడు ఒక లావుపాటి దొంగ మీసం సవరించుకుంటూ—

"ఇంత చిన్న ప్రయత్నానికి యింత గుంపెందుకూ? గుర్రము, ఖడ్గమూ తప్ప యీ ధనం అంతటినీ మీరు తీసుకొని పంచుకోండి।" అని ధనం మూటను వాళ్ళమీద పడేశాడు వీరమల్లుడు.

దొంగలకు ఆశ్చర్యం కలిగింది. ధనం మూటను భద్రపర్చు కున్నారు. పసివాడు కోరాడన్న అభిమానంతో అతను కోరిన విధంగా గుర్రాన్ని, ఖడ్గాన్ని మాత్రం వదిలేశారు.

తన వద్దనున్న ధనం మూటను తీసుకొని వెళ్ళిపోతున్న దొంగల్ని చూసి లోలోన చిన్నగా నవ్వుకొని గుర్రం ఎక్కాడు వీరమల్లుడు.

తన తండ్రి శరీరం ఏమయిందోనన్న ఆలోచనతో వీరమల్లుడు తిన్నగా వూరి బయటవున్న తన యింటికి వెళ్ళాడు. ఇంటి ముందు తన తండ్రి శవం పొదల చాటున పడివుంది. ఆదుర్దాతో గుర్రం దిగి నాలు

గడుగులు వేసేసరికి ఒక కుక్క ఆ వృద్ధుని కాలుపట్టి లాగుతోంది— వీరమల్లుడు కళ్ళవెంట నీరు తిరిగింది. కుక్కను అవతలకు తరిమేడు. గుర్రాన్ని అక్కడున్న చెట్టుకి కట్టేసి తండ్రి శరీరాన్ని తన తలపంచతో చుట్టి భుజంమీదకు ఎత్తుకోబోయాడు. బరువుగా వుండటం వలన లేవదీయ లేకపోయాడు. అక్కడే ఆగి చుట్టూ చూశాడు. వచ్చే పోయేవారు అక్క డక్కడ పల్చగా కనుపిస్తున్నా, ఎవ్వరూ పట్టించుకోవటంలేదు."ఏమిటని" ఎవ్వరూ అడగలేదు. పిల్చినా పలకడంలేదు. దానికి కారణం తను అల్లరి చిల్లరిగా తిరిగి వుండటం, అన్న యదార్ధం వీరమల్లుడికి తెలియకపోలేదు. తన తండ్రి శరీరాన్ని మట్టి చేయాలి! ఎలా చెయ్యటం; క్షణం ఆలోచించి గుర్రాన్ని చూశాడు—శరీరాన్ని గుర్రంమీద తీసుకెళ్ళ దలిచాడు—గుర్రం మీదకు ఎక్కించటానికి సహాయం చేసే దెవరు?

తనను దోచుకోటానికి తనమీద కురికిన దొంగల గుంపు గుర్రాల మీద అటువైపుగా వేగంగా వస్తున్నారు. వాళ్ళ మార్గానికి అడ్డుగావెళ్ళి వాళ్ళను ఆపి, వారికి తన పరిస్థితి చెప్పి సహాయం చేయమని కోరాడు వీరమల్లుడు.

వాళ్ళు జాలిపడ్డారు. వీరమల్లునికి సహాయం చేయటానికి అంగీక రించి గుర్రాలు దిగి అతని తండ్రి శరీరాన్ని వీరమల్లు గుర్రంమీదకు ఎక్కించారు. వీరమల్లుతోకూడా అందరూ శ్మశానానికి వెళ్ళారు.

దొంగలగుంపు సహాయంతో తండ్రి శరీరాన్ని మట్టిలో కలిపి యింటికి వచ్చాడు వీరమల్లుడు. గుర్రాన్ని బయట స్తంభానికి కట్టేసి తను వీధి అరుగుమీద కూర్చున్నాడు. చీకటి పడింది. అప్పట్లో అతని బ్రతుకే చీకటి మయంగావుంది. ముందు తన గతేమిటి? ఇదే ఆలోచనతో రాత్రి రెండో ఝాము వరకు ఆలోచించాడు. అక్కడే వున్న స్తంభానికి చేర గిలబడి కన్నుమూసి కునుకు తీశాడు వీరమల్లుడు.

# 2

వీరమల్లుడు తను సకల విద్యలూ నేర్చుకొని పెద్ద పండితుడు కావాలన్న పట్టుదలతో బయలుదేరాడు.

పట్టుదల అనేది వుంటే ఎటువంటి పనులు ఐనా యిట్టే సునాయాసంగా ఎదుర్కోనూవచ్చు- విజయం సాధించనూ వచ్చు.

ఆ బాలుడులో అంత పట్టుదల రావటానికి మొదటి కారణం తన వయస్కుడైన యువరాజు తనను చులకన చేసి మాట్లాడటం. రెండవది మహారాజు మదన్‌సింగు యిచ్చిన దివ్య సందేశం.

కాని యేంలాభం? ఎక్కడికి వెళ్ళినా పొద్దెక్కింది. ఏ పుణ్యాత్ముణ్ణి అడిగినా తన శిష్యరికం వద్దనేవాడే. తనకు గురువంటూ దొరకడేమో అనే దిగులు అతనిలో నరనరంలోనూ పాకిపోయింది. అతని విషయం తెలిసున్నంతవరకూ యెవరూ అతనికి ఆశ్రయమివ్వరన్న సంగతి అతనికి తెలుసు. అందువలన ఆ నగరంలో ప్రయత్నించడం నిష్ప్రయోజనంగా యెంచి, మహారాజు యిచ్చిన గుర్రంమీద జయంతీ నగరానికి అరవై ఆమడల దూరమున్న మయూరీ నగరానికి బయలుదేరాడు.

ఆ నగరంలో పండితులు ఎక్కువగా వుంటారని- ఆ నగరంలో పేరు ప్రఖ్యాతులు వున్నాయి ఆ నగరానికి. తను ఆ నగరంవెళ్ళి ఏ పండితుడినో ఆశ్రయించి తన మనోవాంఛ నెరవేర్చుకోవాలని అనుకున్నాడు.

మయూరీ నగరంవైపుగా బయల్దేరిన వీరమల్లుడుకు మార్గమధ్యములో ఓ స్నేహితుడు కలిశాడు. ఇద్దరూ కలసి అరణ్యం ప్రవేశించి పది ఆమడలు వెళ్ళేసరికి అలసట అయింది.తన మిత్రుడు మరో దిక్కుగా వెళ్ళిపోయాడు. దప్పిక, ఆకలి ఎక్కువగుటవల్ల గుర్రంమీద కూర్చోలేకపోయాడు.అదే పరిస్థితి గుర్రానికికూడాఏర్పడింది అనమీపంలో ఎక్కడనైనా కొద్దిసేపు విశ్రాంతి తీసుకొని బయల్దేర వచ్చునన్న ఉద్దేశంతో గుర్రందిగి చుట్టూ కలియచూశాడు. కనుచూపు మేరలో ఎక్కడా నీరు కనిపించలేదు; వుండటానికి సరైన ప్రదేశమూ చిక్కలేదు - క్షణం ఆలోచించి గుర్రం

కళ్ళెం తాడు పట్టుకొని కాలినడకతో కొద్దిగా ముందుకి నడిచాడు వీరమల్లుడు.

అక్కడకు కొంతదూరంలో ఓ చీకటి గుహ కనపడింది. అందులో పాడుపడిన గుడి కనిపించింది - ఆ ప్రాంతాలలో మనుషులెవరూ కనిపించ



లేదు. నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ గుర్రంతో సహా ఆలయం వైపుగా నాలుగు అడుగులు వేశాడు.

ఆలయం ప్రధాన గుమ్మం ప్రక్కనే ఒక ముసలమ్మ కూర్చొని వుంది. ఆమెను చూసేసరికి వీరమల్లుడికి ఆశ్చర్యం కలిగింది - తన ఆకలి, దప్పికలు మరచిపోయాడు. 'అంత అడవిలో, నరసంచారంలేని ఆ ప్రదేశంలో ఓ పాడుబడిన గుడిలో ఒక అవ్వ వుండటమా? యెవరీ అవ్వ.

యిక్కడ ఎందుకు వుంటోంది?' తనలో తను ప్రశ్నించుకుంటూ నోరెత్తి మాట్లాడలేక కళ్ళప్పగించి అవ్వను అలానే చూస్తున్నాడు.

* * *

"ఎవరబ్బాయి నువ్వు?" బాగా వణుకుతున్న గొంతుతో అంది అవ్వ.



"నేను ఎవరైనా నీకు అనవసరం! నువ్వెవరు? యిక్కడికెందుకొచ్చావ్?" అడుగు ముందుకివేసి జంకులేకుండా అడిగాడు వీరమల్లుడు.

అవ్వ నవ్వింది "నీ గురించి నాకు చెప్పడం అనవసరం అయితే నా గురించి నీకు చెప్పడమూ అనవసరమే!" అంది అవ్వ-హా....హా....హా....అని బోసి నోటితో నవ్వుతూ—

"ఈ ముసలమ్మ యేం సహాయం చేస్తుందని నీ వనుకోవచ్చు! సహాయం చేసినా, సలహా యిచ్చినా నేనే చేయాలి!" .... వణుకుతున్న స్వరంతో అంది అవ్వ.

ముందు కూర్చోమంటూ అతగాణ్ణి కూర్చో పెట్టింది — తనూ కూర్చుంది.

"నాకు దాహంగా వుంది" అన్నాడు వీరమల్లుడు.

"ఆలయం లోపల తలుపు ప్రక్కనే నీళ్ళకుండ వుంది. వెళ్ళి త్రాగిరా" అంది అవ్వ.

వీరమల్లుడు గుడి లోపలికి అడుగుపెట్టాడు. అతని కళ్ళు ఎదురుగా బారీ ఎత్తువున్న కాళికా విగ్రహంమీద నిలిచాయ్! అప్పుడే ఎవరో పూజచేసి నట్లుగావుంది. ఆశ్చర్యంతో అతని కళ్ళు మెరిశాయ్! రెప్పపాటు కాలం ఆలోచించి కాళీ విగ్రహంముందు బోర్లగాపడి సాష్టాంగ నమస్కారం చేశాడు. విగ్రహం పాదాల మీదున్న పువ్వును అందుకొని చెవిలో పెట్టుకున్నాడు. ఆ ప్రక్కనే పళ్ళు, కొట్టిన కొబ్బరి చిప్పలు, అరటిపళ్ళు పగ్గె రాలు పళ్లెంలో వున్నాయ్! ఆకలిగా వున్న అతగానికి నోరూరింది. వెంటనే వాటిని ఆరగించి కడుపునిండా నీళ్ళు పట్టించాడు. గుర్రం గురించి అప్పుడు గుర్తుకి వచ్చింది. అంతలో "ఏమబ్బాయ్! నీళ్ళు త్రాగడానికి యింతసేపా?" అంది అవతలనుంచి అవ్వ.

తినగా మిగిలిన పెచ్చులు పళ్ళెంలో వేసుకొని తీసుకొచ్చాడు. అవ్వ అర్థమవనట్లు చూసింది.

"అవును అవ్వా! నేను ఆకలి తీర్చుకున్నాను! గుర్రం ఆకలి తీర్చే టందుకు యివి తీసుకొచ్చాను. దాని ఆకలికూడా తీరేక మనం తీరికగా కూర్చుని మాట్లాడుకోవచ్చు" అని అవ్వ సమాధానం కోసం ఎదురు చూడకుండా గుర్రం వద్దకువెళ్ళి పెచ్చులన్నీ దానిముందు వేశాడు. ఆ వెంటనే లోపలవున్న కుండ తెచ్చి గుర్రంముందు పెట్టాడు వీరమల్లుడు.

అవ్వ పెదవి కదిల్చి పలుకలేదు. గడపలో నిలబడి చిత్రంగా వీరమల్లుని కళ్లార్పకుండా చూస్తోంది.

గుర్రం నీళ్ళు త్రాగాలని ప్రయత్నించింది. కుండమూతి చిన్నదిగా వుండుటవల్ల నీరు త్రాగలేక వీరమల్లుని వంక దీనంగా చూసింది. వీరమల్లుడు రెప్పపాటు కాలం యోచించాడు. నడుంకి వ్రేలాడుతున్న కత్తి తీసి కుండ మూతిచుట్టూ కొట్టి కుండ అంచును తీసేశాడు. గుర్రం సునాయాసంగా నీళ్ళు త్రాగింది.

అవ్వ తేరుకుంది. నొసలు చిట్లించి చూస్తూ "ఏం బాబూ! నీటి కుండను నిష్కారణంగా పగలకొట్టావ్! ముందు నేనేం చేయాలి?" అని ప్రశ్నించింది.

వీరమల్లుడు చిన్నగా నవ్వాడు. "ఎప్పటి సంగతో ఆలోచించడం కన్న ప్రస్తుత కర్తవ్యం ఆలోచించాను! అంతకుమించి గత్యంతరంలేక పోయింది" అన్నాడు. ఆ వెంటనే అవ్వకు కోపం వచ్చిందేమోనని తలచి చటుక్కున అవ్వ ప్రక్కకు వెళ్ళి నిలబడ్డాడు. "యిప్పుడు చెప్పు అవ్వా!" అన్నాడు వీరమల్లుడు.

"నీ కథ ముందు చెప్పు!" అంది అవ్వ.

వీరమల్లుడు అక్షరం విడవకుండా తన కథను విపులంగా చెప్పాడు.

"మరి నీ కథ చెప్పు!" అడిగాడు వీరమల్లుడు.

"నేను ఇక్కడికి యాభై ఆమడల దూరంలో వున్న సుపీఠా నగరాధీశ్వరుడు అయిన ప్రభుసేనుని కుమార్తెను. నేను నా తలిదండ్రులకు ఏకైక పుత్రికను. నన్నొక మాంత్రికుడు చెరబట్టి తీసుకొచ్చాడు! తన వశం చేసుకోవాలని ప్రయత్నించి విఫలుడై, ఆగ్రహావేశుడై నన్ను వృద్ధురాలుగా మార్చి యిక్కడ వదిలేసి వెళ్లేడు. ఇక్కణ్ణుంచి నేను ఎటూ వెళ్లేందుకు వీలుపడకుండా మంత్రశక్తితో బంధించాడు. అప్పటి నుంచీ యిక్కడనే వుంటూ మహాకాళిని ఆరాధిస్తున్నాను" అని ఆగింది అవ్వ.

"అయితే అవ్వా! నీకీ ముసలిరూపం పోయే మార్గం లేదా?" అడిగాడు వీరమల్లుడు.

"వుంది! ఒకసారి కాళీమాత ప్రత్యక్షమై ఒక బాలుని సహాయంతో నీకు యధారూపం రాగలదని చెప్పింది. అప్పటినుంచి యే బాలుడు కనిపించినా, అతనికి నా కథ చెప్పి విముక్తి ప్రసాదించమని వేడుకుంటున్నాను! ఎవరివలనా నాకు విముక్తి కలుగలేదు" బాధగా అని చెమ్మగిలిన కళ్ళను పమిటచెంగుతో వత్తుకుంది.

వీరమల్లుడు క్షణం ఆలోచించాడు. పెదవి కొరుక్కుంటూ అవ్వను చూశాడు.

"ఆ బాలుడు ఎవరో చెప్పలేదా?" అడిగాడు.

"ఎవరైనా కావచ్చు! ధైర్య సాహసాలు గలిగినవాడై యుండాలి."

"అయితే నేను నీకు సహాయం చేస్తాను" గర్వంతో అన్నాడు వీరమల్లుడు.

అవ్వ పెద్ద పెట్టున నవ్వింది! "అది అంత తేలికకాదు వెర్రిబాలకా! పట్టుమని పదహారు సంవత్సరాలయినా లేని నువ్వు నాకు సాయపడతావా?" ఆశ్చర్యంతో అడిగింది.

"అవ్వా! సందేహాలకు యిది సమయంకాదు. కాలం వృధాకాకుండా తెలిసుంటే విధానం చెప్పు" అన్నాడు వీరమల్లుడు.

"ఆలయంలో వున్న కాళీమాత విగ్రహానికి వెనక ప్రక్కన గోడకు ఒక ద్వారం వుంది. ఆ ద్వారానికి అడ్డుగా పెద్ద బండవుంది. దాన్ని యితరుల సహాయం లేకుండా ప్రక్కకు నెట్టాలి! అక్కడ్నుంచి లోపలకు మెట్లుంటాయి. కొంతదూరం వెళ్ళేసరికి రాక్షస ఆకారాలు, విష జంతువులు తటస్థపడతాయి. అక్కడ తప్పించుకొని మరి కొంతదూరం వెడితే ప్రళయ కాల భయంకర భైరవి విగ్రహం కనిపిస్తుంది. ఆ విగ్రహం పాదాలముందు దివ్య తేజస్సు కలిగిన 'వికాళిని' అనే 'మణి' వుంటుంది. ఆ మణిని

తీసుకురావాలి; దాని కాంతి ప్రభావంతో నా యథారూపం నాకు ప్రాప్తించ గలదు" ఆగింది అవ్వ.

"అయితే నేను సాధించగలను; 'ధైర్యం, సాహసం, రెండూ వుంటే విజయలక్ష్మి ప్రాప్తించగలదు' అని మాఅయ్య యెప్పుడూ చెప్తుం టాడు; ప్రయత్నిస్తాను; గెలుపో, ఓటమో తర్వాత;" అంటూనే అవ్వ సమాధానం కోసం ఎదురు చూడకుండా లేచి నిలబడ్డాడు;

"ఊ; పద" అన్నాడు.

ఇద్దరూ ఆలయంలోకి నడిచారు—

వీరమల్లుడు ఆలయం-లో అడుగుపెట్టి కాళీమాతకు నమస్కరించేడు. అవ్వ వంక చిరునవ్వుతో చూసి అవతలగదిలో అడుగుపెట్టాడు - అవ్వ అతగాణ్ణి అనుసరించింది—

దారికి అడ్డుగావున్న బండను అటూ యిటూ కదిలించాడు; కదల లేదు; ఆ ప్రదేశం అంతటను పరీక్షగా చూస్తున్నాడు. అదే సమయంగా ఎంచి అవ్వ గోడకున్న 'పిడి'ని పట్టుకొని గుంజింది. దారికి అడ్డుగావున్న బండ ప్రక్కకు తప్పుకుంది. తన బలంవల్లనే బండను తప్పించగలిగే ననుకున్నాడు వీరమల్లుడు. విజయగర్వంతో అవ్వను చూస్తూ "నాతో లోపలకు నువ్వు వస్తావా అవ్వా" అని అడిగాడు.

అవ్వ తల అడ్డంగా తిప్పింది. "స్త్రీలు లోపల ప్రవేశించరాదు" అంటూ చిన్నగా నవ్వింది.

"ధైర్యంగా లోపలకు నడు బాలకా!" తిరిగి అంది అవ్వ.

వీరమల్లుడు మెట్లు దిగుతున్నాడు.

అవ్వ గభాల్న వెనక్కి తిరిగి కాళీమాత నుద్దేశించి "మాతా! ఈ బాలునితో సహా వందమంది బాలురూ పూర్తి అవుతారు. ఈతని సంహా రంతో నా ఆశయాన్ని యీడేర్చు మాతా!" ఆనంద పరవశురాలై ఆవే శంతో అన్నదా అవ్వ.

మెట్లుదిగి లోపలకు వెడుతున్న వీరమల్లునికి ఆమె మాటలు విని పించాయ్! టక్కున ఆగి తలతిప్పి చూశాడు. అప్పటికే దారి మూతబడింది. క్షణం బి త్తరపోయాడు. అంతలోనే తేరుకుని నడుంకి వ్రేలాడుతున్న కత్తిని చూసుకున్నాడు. విసురుగా బయటికి లాగేడు. కుడిచేత్తో కత్తి పట్టుకున్నాడు అక్కడే గోడలో వున్న కాగడాని ఎడం చేతిలోకి తీసుకుని ముందుకి సాగేడు....అడ్డు వచ్చిన విషసర్పాల్ని యుక్తిగా దాటేడు. యే మహాకాళినయితే అడ్డం పెట్టుకుని అవ్వ తనను మోసగించిందో ఆ కాళీ మాతను స్మరించడం కన్న గత్యంతరం లేకపోయింది. "జై మహాకాళీ" అంటూ అడ్డువచ్చిన రాక్షస ఆకారాలమీద కత్తిని దూశాడు. అతని ధాటికి తట్టుకోలేని రాక్షస ఆకారాలు పలాయన మంత్రం పఠించాయి. శరీరాన్ని తేలిక చేసుకుని ముందుకి వెడుతున్నాడు.

"బాలుడా! అవ్వదంతా మోసం!" అంది యేదో 'స్త్రీ' గొంతు.

వీరమల్లుడు ఆగి చుట్టూ పరికించి చూశాడు యెవ్వరూ కనబడలేదు. అంతలో "తెలివి వుపయోగిస్తే బ్రతికి బయట పడతావ్? అవ్వ చెప్పింది కట్టుకథ? నిజంకాదు! యిక్కడే ఇనుప స్థంభం చాటునే వున్నాను! అవ్వ నీ వెనకనే వస్తుంది. వెనుతిరిగి చూడకుండా ముందుకు రా!" తిరిగి 'స్త్రీ' గొంతు అన్నది.

రహస్యంగా వీరమల్లుని అనుసరిస్తున్న అవ్వకు ఆశ్చర్యంవేసింది. చూపులకు కుర్రవాడు! సాహస బాలుడుగా అంతంత బలశాలులైన అను చరులను సంహరించడం చిత్రంగా తోచింది....

వీరమల్లుడు వెలుగువున్న గదిలో అడుగుపెట్టాడు. ఆ ప్రదేశం రక్తమయంగా వుంది. అవతలగా తలలు వ్రేలాడుతున్నాయ్! ఆ ప్రక్కనే గంద్రగొడ్డలి ఒక స్థంభానికి వ్రేలాడుతున్నది. అవ్వ మాటలు, కనబడని 'స్త్రీ' మాటలు చెవుల్లో ప్రతిధ్వనించినాయ్! అనుకోకుండా అతని కళ్ళు అప్పటికే వచ్చి గంద్రగొడ్డలి వున్న స్థంభంచాటున నిలబడిన అవ్వమీద పడ్డాయ్! తనకేమీ తెలియనట్లు అభినయిస్తూ చేతిలోవున్న కత్తిని ప్రక్కన

పెట్టి, ప్రచండ భైరవిముందు మోకాళ్ళమీద కూర్చుని తలవంచి నమస్కరించాడు....అవ్వ చటుక్కున యివతలకు వచ్చి గండ్రగొడ్డలితో అతగాని తల నరకబోయింది. వీరమల్లుకు ప్రక్కకు దొర్లేడు। గండ్రగొడ్డలి నేలలో గుచ్చుకుంది. అవ్వ ఆవేశంతో దాన్ని పెగల్చాలని ప్రయత్నిస్తోంది. ఆమె కళ్లు చింత నిప్పుల్లా మెరుస్తున్నాయ్.

"తెలివి తేటలు నీకే లేవు. చిన్న వయస్సులో వున్న వాళ్ళకీ వుంటాయ్।" అని గట్టిగా నవ్వాడు. తన కత్తిని గభాలున అందుకొని ఒక్క వేటు వేశాడు. అవ్వ పెద్ద పెట్టున అరుస్తూ రాక్షసుడుగామారింది. ఆ సందర్భంలో రాక్షస శరీరంనుంచి రక్తపుటేరులు ప్రవహిస్తున్నాయ్. వీరమల్లుడు కనికరించలేదు. భైరవి విగ్రహంముందు భూమిలో దిగబడిన గండ్రగొడ్డలి అందుకొని తెలివిగా రాక్షసి కంఠాన్ని నరికేడు - రాక్షసుని తల వందో తలగా అంతక్రితం అక్కడ వ్రేలాడుతున్న తలల ప్రక్కన పడింది. వీరమల్లుకు వరకాయించి చూశాడు. అక్కడెక్కడా "మణి" కనబడలేదు.

అంతలో "ప్రచండ భైరవి" ప్రత్యక్షమైంది—
వీరమల్లుకు నమస్కరించేడు.

"బాలుడా। 'శకటుడు' అనే రాక్షసుడు పన్నినకుట్ర యిది। అవ్వగా మభ్యపెట్టి నీ వంటి బాలురను ఎందరినో యిక్కడ బలిచ్చాడు. నీ తలతోకూడా వందమంది పూర్తి అయ్యేవాళ్లు। అప్పుడు నా పాదాల వద్దనున్న 'వికాసిని' మణిని హస్తగతం చేసుకునేవాడు. చివరి ఘడియల్లో విజయం నీకు ప్రాప్తించింది. అందువలన మణిని నీ కిస్తున్నాను।" చిరునవ్వుతో 'వికాసిని మణిని' వీరమల్లుని చేతిలో పెట్టింది.

"ఆ మణిని తదేకంగా చూస్తూ, నన్ను తల్చుకుంటే మనస్సులో వున్న కోరికలు ఫలిస్తాయి. తల, మొండెము, బూడిద కాకుండా వుంటే యెవరన్నయినా బ్రతికించవచ్చు। దాని సహాయంతో యెటువంటి కార్యా

న్నయినా సాధించవచ్చు! నీకు జయం చేకూరుగాక!" అంటూ ఆశీర్వ దించింది, అదృశ్యమైంది ప్రచండభైరవి.

"మహా ప్రసాదము" తలవంచి నమస్కరించేడు వీరమల్లుడు.

రాక్షసుని సహాయం వలననే తనకు 'మణి' ప్రాప్తించిందన్న విశ్వాసంతో రాక్షసుని బ్రతికించాడు. రాక్షసుడు క్షమాపణ చెప్పుకొని వెళ్ళిపోయాడు.

వీరమల్లుడు తిరిగి వెడుతూండగా 'స్త్రీ' గొంతు గుర్తుకువచ్చింది. మాటలు వినబడిన స్థంభం దగ్గరకు వెళ్లాడు! ఆమె స్థంభం చాటునేవుంది. ఆమెను చూస్తూ—

"సుందరీ! నువ్విక్కడకి ఎందుకొచ్చావ్!" అడిగాడు వీరమల్లుడు.

"మా అన్నను రక్షించుకునే నిమిత్తం వచ్చి యిక్కడ చిక్కుకున్నాను! రాక్షసుడు గమనించకుండా యీ స్థంభం చాటున వున్నాను!" అని నమస్కరించింది.

"నువ్వు ఎక్కడికి వెడతావ్?" అడిగాడు వీరమల్లుడు.

"అనుగ్రహం వుంటే వీరశేఖరులతోనే వుంటాను" అన్నది చిరునవ్వుతో ఆ చిన్నారి.

ఆమె మనోభావాన్ని అర్థం చేసుకున్నాడు. వెంటనే చిరునవ్వుతో ఆమెను చూస్తూ "నీ పేరు?" అడిగాడు.

"నా పేరు జగదీశ్వరి! మాది సుగంధీనగరం – మా అమ్మగారు చనిపోవడంతో మా నాన్నగారు రెండో వివాహం చేసుకున్నారు. మా మారుటి తల్లి పేరు 'తాయారు' ఆమె పెట్టే బాధలు భరించలేక నేనూ మా అన్న అడవుల పాలయ్యాం. మా అన్న, నేనూ ఆలయం వద్దకు చేరగానే అప్పుగా వున్న రాక్షసి మా అన్నను మోహగించి లోపలకు తీసుకువెళ్ళి నన్ను బయటే కూర్చోమన్నది. తర్వాత ఆ రాక్షసి కాంక్ష తెలుసుకొన్నాను. అప్పు వెనకే లోపల ప్రవేశించాను. మా అన్న తల నరికేసరికి

నాకు భయంవేసింది. అక్కడే స్తంభం చాటున నక్కాను. చిన్నపిల్లను కావడంతో ఎటూ కదిలి వెళ్ళలేకపోయాను."

అయితే మీ అన్న తల, మొండెం ఏవి" అని ప్రశ్నించాడు వీరమల్లుడు. ఆమె ఏడుస్తూ "ఇప్పటికి చాలా కాలమైంది. గుర్తుపట్టలేనంతగా



తల, మొండెంతో బొమికలు మిగిలాయి." అంటూ వీరసంగా ఏడ్వసాగింది. అంతట వీరమల్లుడు ఆమెను ఓదార్చి-

"నీ వయస్సు ఎంత?" అడిగాడు.

"పదమూడు వత్సరాలు" అంది జగదీశ్వరి.

"అయితే నువ్వు నా దగ్గరే వుంటావా?"

వీరమల్లుని ప్రశ్నకు సమాధానం యివ్వలేదు జగదీశ్వరి.

తక్షణం 'వికాసిని మణి' సహాయంతో కాళీమాతను పిలిచాడు. మాత ప్రత్యక్షమైంది. తనను "మహా పండితులలో ప్రసిద్ధి కెక్కిన వాడుగా మార్చు"మన్నాడు. మహాకాళి కరుణించి అతని నాలుకమీద బీజాక్షరాలు

ప్రార్థించింది. అంతేగాకుండా 'జగదీశ్వరిని' వివాహమాడమని చెప్పింది. వీరమల్లుడు అంగీకరించేడు. మాత అదృశ్యం అయింది. తదుపరి ఆలయాన్ని పవిత్రంచేసి నిత్య ధూపదీప నైవేద్యాలకుగాను పురోహితుణ్ణి సృష్టించేడు 'మణి' సహాయంతో—అక్కడే అతగాడు వుండేందుకు చక్కని కుటీరం నిర్మించాడు.

ఆ తర్వాత జగదీశ్వరితో పాటుగా - 'మణి'తో సహా గుర్రంమీద బయల్దేరాడు వీరమల్లుడు.

# 3

గుర్రంమీద వెడుతున్న వీరమల్లుడు కర్తవ్యం ఆలోచిస్తున్నాడు. గుర్రం పరుగుకన్నా వేగంగా మెదడులో ఆలోచనలు సుడులు తిరుగుతున్నాయి. అతనితోపాటు గుర్రంమీద వున్న కన్య 'జగదీశ్వరి' యేమి పట్టనట్లు చుట్టూ తిలకిస్తున్నది - గుర్రం వేగం మాత్రం తగ్గలేదు. అతను గుర్రాన్ని ఉద్దేశించి కర్తవ్యం బోధించమన్నాడు.

వెంటనే గుర్రం దారి తప్పింది. వాయువేగాన్ని పోటీ చేస్తూ పరుగెత్తసాగింది. వీరమల్లునికి అర్థంకాలేదు. కళ్ళెంలాగి పట్టాడు. గుర్రం ఆగలేదు. కొంతదూరం వెళ్ళాక యెదురుగా ఒక స్త్రీ పరుగెత్తుకుంటూ వస్తున్నది. ఆ అపరిచిత స్త్రీ అరణ్య ప్రాంతంలో ఎందుకున్నది? అని ప్రశ్నించుకున్నాడు. ఆమె గుర్రానికి అడ్డుగా వస్తూ గుర్రాన్ని ఆపమని వేడుకున్నది.

వీరమల్లుడు బాగా లాగిపట్టేడు కళ్లెం. అలసట చెందిన గుర్రం ఆగింది.

"ఎవరు తల్లీ నువ్వు? ఎందుకు గుర్రాన్ని ఆపేవు?" అడిగాడు.

"నా భర్త దావు ద్రికుకుల్లో వున్నారు. మీ చేతిలో గుర్రంవుంది.

వైద్యుర్ని ఎవర్నయినా తీసుకువస్తే" ఆగింది ఆమె కంఠం జీరబోయింది.

వీరమల్లునికి ఆమె పరిస్థితి జాలి కలిగించింది. వెంటనే తన వద్దనున్న వికాసిని మణి గుర్తుకు వచ్చింది — గట్టిగా ఊపిరి పీల్చుకున్నాడు. "మీ నివాసం ఎక్కడ?" అని అడిగాడు.

"ఇక్కడికి సమీపంలోనే. రండి చూపిస్తాను." అన్నది.

"మీ భర్తను బ్రతికించేటందుకు వేరే వైద్యులు అవసరంలేదు. నేను బ్రతికిస్తాను."

"మీ మేలు జన్మ జన్మలకీ మరువను." కంటతడి తుడ్చుకుని అన్నది ఆమె.

"మీరు సోదరి వంటివారు. అన్యధా భావించకుండా వుంటే గుర్రం ఎక్కండి" అని వీరమల్లుడు అనగానే ఆమె మారు మాట్లాడకుండా జగదీశ్వరి వెనక ఎక్కి కూర్చుంది. ఆమె నివాసం గురించి ప్రశ్నించకుండా మణి సహాయంతో అపాయంలో వున్న బ్రాహ్మణుని కుటీరం చేరే దా మగ్గుకు గుర్రంతో పహా— ఓసారి 'మణి'ని జాగ్రత్తగా చూసుకొన్నాడు వీరమల్లుడు.

'మణి' సహాయంతో విప్రుడు ఆరోగ్యవంతుడయాడు. ఆ దంపతుల ఆనందానికి అంతులేదు. అతగాడు చేసిన సహాయానికి సంతోషించేరు. కానీ, అంతలోనే విప్రుని ముఖం యేదో విచారంతో వుండడం గ్రహించిన వీరమల్లుడు "యేమిట"ని ప్రశ్నించాడు.

"తీరని అవమానం జరిగింది అనే బాధ. ఆ దిగులుతోనే మంచం పట్టేరు." నిరుత్సాహం కనబరుస్తూ అన్నది బ్రాహ్మణ స్త్రీ.

"విషయం విపులంగా చెప్పండి." వీరమల్లుడు ప్రశ్నించాడు.

"నమ్మిన శిష్యుడు గురుద్రోహం చేశాడు" అన్నాడు బ్రాహ్మణుడు.

"గురు ద్రోహమా!" ప్రశ్నించాడు.

"అవును! నా వద్ద శుశ్రూషచేసి పలు విద్యలూ అభ్యసించాడు విశాలభద్రపండితుడు. పరకాయ విద్యను నేర్పమని కోరేడు! ఆ విద్య నేర్పాలంటే దానికి కొన్ని నియమాలున్నాయ్. వాటిల్లో ముఖ్యమైనది మనస్సు




పవిత్రం కావాలి! అతగానికి అది లోపించింది. అందువలన నేర్పడానికి సందేహించాను! దాంతో వాడు నాకు ద్రోహం చేశాడు."

"ఏ విధంగా!" తిరిగి అడిగాడు వీరమల్లుడు.

"ఓ మహా గొప్ప మహర్షి—పేరు పరబ్రహ్మ మహర్షి—ఒక సందర్భంలో నాకు 'చక్రనేమి' అనే అంగుళీకాన్ని ప్రసాదించేడు! దాన్ని

అపహరించాడు. అది తిరిగి నా హస్తగతమయ్యేవరకూ నాకు మనస్థిమితంలేదు. అదే నేను మంచం పట్టడానికి కారణం" అని చెప్పాడు విప్రుడు.

"ఇప్పుడా వీరభద్రపండితుడు ఎక్కడున్నాడు?" జగదీశ్వరి అడిగింది—

"జయంతి నగరంలో ప్రభువుల ఆస్థాన పండితుడుగా వుంటున్నాడు. నేను ఒకసారి వెళ్ళి నా అంగుళీకం నాకు యివ్వమని వేడుకున్నాను. ఆ దుష్టుడు గురువనే భావాన్ని మరచి విర్రవీగాడు. తన ప్రతి



భను చాటుకుంటూ కన్నుగానక ప్రవర్తించి నన్ను నిండు సభనుంచి గెంటించేడు. ఇంతకన్న జరగవలసిన పరాభవమేముంది?" అని నిరుత్సాహం కనబరుస్తూ ఊపిరి పీల్చుకున్నాడు విప్రుడు.

వీరమల్లుడు మరియసేపు తీవ్రంగా యోచించేడు. ఆ వెంటనే బ్రాహ్మణ దంపతుల్ని ఓదార్చేడు. "బ్రాహ్మణోత్తమా! మీరు దిగులు

చెందకండి! ఆ స్వామి దయవల్ల, యీ 'మణి' ప్రభావంవల్ల మీ శిష్యునకు గుణపాఠం నేను చెప్పి, ఆ పిదపిచే మీ కాళ్ళు పట్టిస్తాను! సరేనా!" అన్నాడు.

బ్రాహ్మణుడు పేలవంగా నవ్వాడు. "నాయుడువి! రాజసభలో కవీశం ప్రవేశించే అర్హతయినా కలిగించరే!" అంది స్త్రీ.

"అందును గురించి మీకు అనుమానం అక్కర్లేదు!" మధ్యలో అంది జగదీశ్వరి.

"మీరు నేను చెప్పినట్లు చేయండి!" అన్నాడు వీరమల్లుడు.

"తప్పకుండాను! ఏమిటది!" ఎదురు ప్రశ్న వేశాడు విప్రుడు.

విప్రుడికి అతగాడు చేయవలసిన విధానం గురించి బోధించే నిమిత్తం తనతో తీసుకు వెళ్లాడు వీరమల్లుడు.

ఒక బాలిక ఒంటికంటి గుర్రాన్ని వెంట తీసుకొని జయంతీ నగర కోటలో ప్రవేశించింది. లోపలకు వెళ్లేందుకు రాజభటులు నిరాకరించేరు; వాళ్ళను యెంతగా ప్రాధేయపడి అడిగినా 'రాజాజ్ఞ' లేనివాళ్ళు పిల్లలయినా పెద్దలయినా కోటలో ప్రవేశించ రాదన్నారు.

అదే సమయంలో యువరాజు జగత్‌సింగ్ గుర్రంమీద కోటలో ప్రవేశిస్తూ ఆగి బాలికను చూశాడు.

"దొరా! నేను మహారాజుగార్ని చూడాలంటే యీళ్ళు వప్పుకోవటం లేదు! మువ్వన్నా చెప్పు దొరా!" అంది వెకిలిగా నవ్వుతూ—

"రాజుగారితో నీకేం పని!" అడిగాడు జగత్‌సింగ్.

"అదా దొరా." నవ్వింది.

"ఇక్కడ మా పెద్ద పెద్ద పండితులున్నారంట! అల్లాను ఓడిస్తే రాజుగారు బహుమతి యిస్తారంట! అందుకొచ్చాను" అంది ఆ పిల్ల.

జగత్‌సింగ్ పెద్ద పెట్టున నవ్వాడు: "నువ్వు అంత పండితురాలివా? యిక్కడ పండితుల్ని ఓడిస్తావా? చిత్రంగా వుందే! సరిగా మాట్లాడడం అయినా రాదు! నువ్వు పండితుల్ని ఓడించడమా?" అన్నాడు.

"నా సంగతి మీకేం తెల్సును! పండితుల్ని ఓడించడంతోనే ఆగను! యీ రాజు కొడుకున్నాడట! ఆడు మహా పొగరుబోతుట! ఆయన్ని కూడా ఓడించేస్తాను!" అంది గర్వంతో —

యువరాజు జగత్‌సింగ్ గతుక్కుమన్నాడు! క్షణం ఆమెను ప్రశ్నార్థకంగా, కన్నార్పకుండా చూశాడు.

"అరే! యువరాజుగారు! కల్పుకున్నారంటే యిక్కడే తల నరికేస్తారు!" అన్నాడు ఒక భటుడు.

"దణ్ణాలు బాబూ! మీరేనా ఆ యువరాజు!" నవ్వుతూ నమస్కరించింది —

మీరు కానా గొప్పోరంట! గర్వం ఎక్కువంట! అధికారంతో తలను నరికేయడానికి మాడక, న్యాయంగా నన్ను ఓడించి మీ గొప్పను దాచుకోండి!" తిరిగి అన్నది బాలిక.

యువరాజు జగత్‌సింగ్ తేరుకున్నాడు. అతగాని కళ్ళల్లోనుంచి గర్వం తొంగి చూస్తున్నది! "ఒకవేళ నువ్వు ఓడిపోతే!" అడిగాడు.

"మీరు చంపి వేసినా చస్తాను! మీరు ఓడిపోతే నేను చెప్పినట్లు మీరు చేయాలి!" అంది బాలిక.

"సరే!" యువరాజు అనగా —

"నేను చెప్పినట్లు చేస్తానని మహారాజా వారిచేత చెప్పించాలి! మీరు ఓడిపోయినా, గెలిచినా అధికార గర్వంతో మీదే పైచేయి అంటారుట."

"ఎవరు చెప్పేరు!"

"దేముడు కలలో కనబడి చెప్పేడు!" అని వ్యంగ్యంగా నవ్వింది బాలిక.

జగత్‌సింగ్‌కి వళ్ళు మండుకొచ్చింది. కాని తాత్కాలికంగా తగ్గాడు. వయస్సు చిన్నది. గర్వం విలువంతా పండిస్తుంది. దాని గర్వం అణచి వేయాలనుకున్నాడు. "నువ్వు కోరినట్లు మా నాన్నగారిచేతనే చెప్పిస్తాను పద" పిల్లతో అని భటుల్ని ఉద్దేశించి "ఈ పిల్లను లోపలికి పంపండి" తిరిగి అంటూనే తన గుర్రాన్ని అదిలించాడు జగత్‌సింగ్—

ఆ పిల్ల తృప్తిగా ఊపిరి పీల్చుకుంది. చిరునవ్వుతో ముందుకి సాగిపోతున్న యువరాజును చూస్తూ నిలబడింది క్షణం అక్కడే.

తను కోరిన విధంగా యువరాజు జగత్‌సింగ్ వెనక ఒంటికంటి గుర్రంతో సహా లోపల ప్రవేశించింది బాలిక.

* * *

రాజసభ కళకళలాడుతోంది — మంది మార్బలం సకలమట్టూ ఆసీనులై వున్నారు—సింహాసనంమీద మహారాజు మదన్‌సింగ్, యువరాజు జగత్‌సింగ్ అవతలగా మరో పీఠంమీద, మరో ప్రక్కన మహామంత్రి కూర్చుని వున్నారు.

సభలో యెదురుగా ఒంటికంటి గుర్రం, ఆ ప్రక్కనే బాలిక నిలబడి వున్నారు—

"మహామంత్రీ! నా అభిప్రాయం ఆ పిల్లకు విశద పర్చండి" మహారాజు మదన్‌సింగ్ అన్నాడు.

మహామంత్రి కళ్ళు సభికులందరి మీదనుంచి పరుగెత్తి ఎదురుగా నిలబడివున్న పిల్ల మీద నిలిచాయి.

"మా యువరాజావారు చెప్పినదంతా మహారాజావారు అంగీకరించారు. మా పండితులనుగానీ లేక మా యువరాజునుగానీ యెందులోనైనా సరే ఓడిస్తే నువ్వు యేది కోరినా మేము తీరుస్తాం! ఒకవేళ నువ్వు ఓడిపోతే యెంత దారుణంగానైనా శిక్షిస్తాం! యిది రాజశాసనం! దీనికి నీ సమాధానం బాగా ఆలోచించుకొని యివ్వు! వయస్సుకి చిన్నపిల్లవి!" అన్నాడు మంత్రి.

"వయస్సుకీ, పాండిత్యానికీ, సంబంధం వుండదు! గెలుపు ఓటము లకు, వయస్సుకి సొంతన లేదు! దయచేసి ఒకదాని కొకటి ముడిపెట్టకండి! రాజశాసనం ప్రకారం నడవడానికి నేను సిద్ధంగా వున్నాను!" అన్నది బాలిక.



"సరే!" అని మహారాజును, యువరాజాని చూశాడు మంత్రి.

మహారాజు తలను పంకించాడు. "పండిత శ్రేష్ఠులు వీరభద్ర పండితులవార్ని ఎదుర్కొని గెలిపొందు" అన్నాడు మహారాజు.

"విశ్వకర్మీన బ్రహ్మాస్త్రమా! ఈ పసికందును ఓడించడానికి నేను కావలెనా! నా శిష్యుల్లో కనపడివాడు చాలునే!" అన్నాడు వీరభద్ర పండితులు.

"ఆ పిచ్చుక నా దృష్టిలో మీరవుతారేమో! తొందరపడి మాట్లాడకండి" అని చిన్నగా నవ్వి గర్వంతో సభికులందర్నీ చూపింది బాలిక.

"ఎంత గర్వం" అన్నాడు పళ్లు కొరుకుతూ వీరభద్రపండితుడు.

"ఆ గర్వం అణచడానికే వచ్చాము! ముందు నేను అడిగిన దానికి సమాధానం చెప్పండి!" అంది బాలిక.

"ఈ బాలికలో యేదో మోసం వుంది! ఇంతక్రితం మాటయినా సరిగా మాట్లాడలేకపోయింది! యిప్పుడు"— అని యువరాజా జగత్‌సింగ్ యేదో అనబోతుండగా బాలిక నవ్వింది.

"యెక్కడ యెలా మాట్లాడాలో నీ కన్నా నాకు ఎక్కువ తెల్సును యువరాజా! అతి ప్రసంగానికి యిక్కడ అవకాశం యివ్వకండి!" అంటూ—

"వీరభద్ర పండితులవారూ! ఇది ఏమిటి?" తనతో వున్న గుర్రంను చూపించి తిరిగి అన్నది.

"అది గుడ్డి గుర్రం!" అన్నాడు వీరభద్ర పండితుడు.

"కాదు! మంచి గుర్రమే! ఒంటికంటి గుర్రం! వున్న ఒక్క కంటితోనూ చూడగలిగే దీన్ని 'గుడ్డిది' అనరు!" అని సమాధానం యిచ్చింది—

వెంటనే వీరభద్రపండితులవారు తన తొందర పాటుకు లోలోన బాధపడ్డారు.

"గుర్రాలు మాట్లాడతాయా?" తిరిగి ప్రశ్నించింది బాలిక.

"మంత్రశక్తితో మాట్లాడించవచ్చును! పండిత శ్రేష్ఠులకు అది యేమంత కష్టమైనది కాదు!" వీరభద్రపండితుడు చెప్పేది పూర్తిగాకుండానే— "అయినచో మాట్లాడించగలరా?" అడిగిందా బాలిక.

"అవయవ లోపముగల ఆ గుర్రాన్ని పలుకరించడం ఎవరివలనా కాదు!" వీరభద్రపండితుడు అన్నాడు.

"మీ రిచ్చిన సమాధానమునుబట్టే మీ పాండిత్యమెంత పండినదో తెలుస్తున్నది" వ్యంగ్యంగా అన్నది.

వీరభద్రపండితులకు ఆగ్రహం అవధులు దాటింది. "ఛీ! తెలిసీ తెలియని పాండిత్యముతో బాలికవు నీవా నన్ను ఓడించునది!" అన్నాడు.

"నేను ఈ అవయవ లోపమున్న గుర్రముచేత మాట్లాడించెదను. అంతేకాదు! పాండిత్యంలో ఈ గుర్రమే నిన్ను ఓడించగలదు" తిరిగి అన్నది బాలిక.

సభికులు విస్తుపోయి చూస్తున్నారు! ఆ బాలిక మాటలు మహారాజా మదన్‌సింగ్‌కి, యువరాజు జగత్‌సింగ్‌కూ ఆశ్చర్యం కలిగించాయి.

"ఊఁ! అదేదో ప్రదర్శించండి!" అన్నాడు యువరాజా జగత్‌సింగ్.

బాలిక గుర్రం చెవిదగ్గ తలవంచి యేదో రహస్యంగా వూదింది. దాంతో గుర్రం పెద్ద పెట్టున నవ్వింది... సభికులందరి దృష్టి గుర్రంమీద, బాలికమీద నిలిచాయ్!

"పండితులూ! పైకి ఎగరగలిగినవేమిటి?" అడిగింది గుర్రం.

ఆశ్చర్యంతో "పక్షులు!" సమాధానం ఇచ్చేడు వీరభద్రపండితుడు.

"ఇతర జంతువులు, మనుషులు ఎగరలేవు గదా?"

"ఎగరలేవు!" వీరభద్రపండితుడు అన్నాడు.

"ఏ జంతువైనా ఎగరగలదు! నీ పాండిత్యం తప్పు" అంది గుర్రము.

"అసంభవం! నువ్వో జంతువువేగా? ఎగురు చూస్తాను!" అన్నాడు వీరభద్రపండితుడు.

అందరూ చూస్తూండగానే గుర్రం సభలోనుండి ఒక ఎగురున

బయటకు వెళ్ళి అంతఃపుర ప్రాంగణాల్లో ఆకాశ వీధిలో చుట్టూ తిరుగుతోంది.

సభికులు ఆశ్చర్యపోయారు. కొద్ది నిమిషాల తర్వాత గుర్రం క్రిందికి వచ్చి—

"ఓటమికి అంగీకరిస్తావా," అన్నది.

వీరభద్రపండితుడు నోరువిప్పి మాట్లాడలేక తలవంచుకున్నాడు.




సభికులు గుర్రాన్ని, బాలికను ప్రశంసిస్తున్నారు. సభలో గుసగుసలు బయలుదేరాయి.

"ఓటమికి అంగీకరించినట్లు పండితుంచేత వప్పించండి మహారాజా" అన్నది బాలిక.

తప్పని సరి అయింది. వీరభద్రపండితులు తన ఓటమిని అంగీకరించాడు. ఆ వెంటనే అతన్ని పండితపీఠం నుంచి దిగివచ్చి గుర్రంకాళ్ళు పట్టి క్షమాపణ కోరుకోమన్నది బాలిక. వీరభద్రపండితుడికి చేయక తప్ప లేదు. అతన్ని గుర్రం పాదాల వద్దనే కూర్చోమని శాసించింది. ఆ వెంటనే మహారాజుని చూస్తూ "ప్రభూ, గెలుపుమాది. ఈ శుభవార్త నగర ప్రజలకు తెలియ పర్చాలి. అందుకు ఒక్కటే మార్గం. ఈ వీరభద్రపండితులకు నున్నగా తలగొరిగించి కుంటిగాడిదమీద బాజాభజంత్రీల సందడిలో వీధి వీధీ వూరేగించాలి. ఇతనివెంట విజయం సాధించిన మా గుర్రం కూడా వుంటుంది" అని కోరింది బాలిక.

మహారాజు అభ్యంతరం చెప్పలేదు. బాలిక చెప్పినట్లు ఆచరణలో పెట్టమని శాసించాడు—భటులు రాజాజ్ఞ పాలించడానికి సిగ్గుతో తలవంచుకొన్న వీరభద్రపండితులను వెంటబెట్టుకు వెళ్ళారు. వాళ్ళ వెనకే వెళ్ళింది ఒంటికంటి గుర్రం.

"అమ్మాయీ నువ్వెవరు. పాండిత్యం వుండగానే సరికాదు. అందుకు తగిన తెలివి తేటలుకూడా వుండాలని రుజువు చేశావ్. నీకు కావలసింది కోరుకో." అన్నాడు మహారాజు మదన్‌సింగ్.

"వచ్చిన పని పూర్తి అయిన మీదకదా నేను కోరుకోవటానికి." అన్నది బాలిక.

"ఏ మా పని?" జగత్‌సింగ్ అడిగాడు.

"పండితుల పని అయినది. యువరాజు జగత్‌సింగ్‌వారికి ఓడించ తం మిగిలిపోయింది కదా మహారాజా" అన్నది బాలిక.

"నీవు ముచ్చట పడుచుంటివిగాని అది నీ వలన జరిగే పనికాదు. తోటి వయస్కులను ఎందరినో ఓడించాడు. కత్తి పట్టడం చేతకాని బాలికవు. నువ్వు ఎలా ఓడిస్తావ్. కనీసం పాండిత్యమైనా వుందా అంటే అదీ లేదు!" అన్నాడు మంత్రి.

"మహామంత్రీ! తినబోతూ రుచి అడగడం మంచిదికాదని పెద్దలైన మీకు నేను చెప్పకూడదు మీరే గ్రహించాలి! యువరాజా ఏ విద్యలో కోరినా నేను సిద్ధంగా వున్నాను!" అంది బాలిక.

యువరాజు జగత్‌సింగుకు పట్టరానంత కోపం వచ్చింది. కూర్చున్న పీఠం మీదనుంచి చర్రున లేచేడు. "వయస్సుకి చిన్నదానివైనా మాటలు వయస్సునుమించి వస్తున్నాయ్! పెద్దల మాటంటే లక్ష్యం లేకుండా మాట్లాడుతున్నావ్?" సూటిగా చూసి అంటూ—

"నేను ఆడవారితో పోరాడను! పండిత పరీక్షకు పూనుకొనను! ఇది నా నియమము! ఇదే మొగాడు అయిన మొనగాడుగా వాణ్ణి మట్టి కరిపించేవాణ్ణి!" అన్నాడు జగత్‌సింగు.

బాలిక పెద్ద పెట్టున నవ్వింది. సభికులు ఆమెనే కన్నార్పకుండా చూస్తున్నారు. "ప్రగల్భాలు కొట్టుకోడంలోనూ, నీ గొప్పను నీవు వెలుగు వేయుటలోనూ సమర్థుడవని అర్థమైంది. పోనీ, యువరాజావారూ మీ మాట ఎందుకు కాదనాలి! సమ వయస్కుడైన బాలుడినే పిలిపిస్తాను" అన్నది బాలిక.

బాలిక ఆ మాట అనడం తడవుగా "అయితే నేను సిద్ధంగానే వున్నాను" అన్నాడు యువరాజా జగత్‌సింగు.

"ఓడినవారు గెలిచిన వారి కోరిక ప్రకారం నడుచుకోవాలన్న షరతు గుర్తున్నది గదా!"

"ఉంది" వెంటనే బాలికను ఉద్దేశించి అన్నాడు జగత్‌సింగు.

"అంగీకరించినట్లు మహారాజావారు స్వయంగా చెప్పాలి" ఎదురుగా సింహాసనాసీనులైన మహారాజా మదన్‌సింగును చూసి అన్నది బాలిక.

"మా కుమారుడు ఆడినమాట తప్పడు! యువరాజా ఓడిపోతే నీ కోరికను తీర్చడానికి మేము ఎప్పుడూ వెనుకడుగు వేయము" అన్నాడు మదన్‌సింగు.

"అయితే మేము సిద్ధం!" అంది బాలిక.

"నేనూ సిద్ధమే। యేదీ పోటీ వచ్చినవ్వాడు?" అంటూనే కత్తిని దూసి గదిమధ్యకు ముందుకు నడిచేడు.

ఎదురుగా వేరొక కత్తి తనకు పోటీగా కనబడింది. మనిషి కను పించకుండ కత్తి మాత్రం కనబడటం- అదీ అటూ యిటూ కదులాడడం చిత్రంగా తోచింది. అందరూ అదే చూస్తున్నారు.

"మోసం! అంతా మోసం! యిదేదో కనికట్టు!" అన్నాడు జగత్‌సింగు.

"కాదు। నీ అహంకారానికే ఆటకట్టు!" అంటూ వీరమల్లుడు చేత కత్తిపట్టి ప్రత్యక్షంగా కనిపించేడు.

"నువ్వా!" అన్నాడు జగత్‌సింగు ఆశ్చర్యంతో.

"ఆ నాడు నువ్వు చూసి, గేలిచేసి, అసమర్థుడుగా సాగనంపిన వీరమల్లుడు కాదు. పండిత శ్రేష్ఠుడుగా వీరాధి వీరుడుగా నిన్ను గెలవ టానికి వచ్చిన వీరమల్లుడను" అన్నాడు వీరమల్లుడు.

మహారాజు మదన్‌సింగు, మంత్రి తదితరులు చిరునవ్వుతో వీర మల్లుని చిత్రంగా చూస్తున్నారు.

జగత్‌సింగూ, వీరమల్లుడులు కత్తులు కలిపి పోరాటానికి ఉపక్ర మించేరు. ఇద్దర్లో పౌరుషాలు పెరిగినాయి। కానీ జగత్‌సింగ్‌ను ఓడించ డానికి వీరమల్లునికి ఎంతో సేపు పట్టలేదు। జగత్‌సింగు ఓడిపోయి తలవంచు కున్నాడు। వీరమల్లుడు తన పాండిత్య పరీక్షకు రమ్మన్నా రాలేదు.

మహారాజు ఆనందంతో సింహాసనం మీదనుంచి దిగి వచ్చి వీర మల్లుని కౌగిలించుకున్నాడు. కావలసింది కోరుకో మన్నాడు.

"మహారాజా! యువరాజుకి దక్కాల్సిన సింహాసనం మా వీరునికి దక్కాలి; మీ యువరాజు యీ వీరునికి అంగరక్షకుడుగా బ్రతకాలి!" అని శాసించింది బాలిక.

ప్రథమంలో మహారాజా గతుక్కుమన్నాడు. తర్వాత యిచ్చిన మాట గుర్తుకు వచ్చింది; అంగీకరించాడు.

"మహారాజా! నేను అవివేకినికాను; సింహాసనాన్ని అలంకరించే అర్హత నాకులేదు; అందుకు యువరాజా జగత్‌సింగులవారే అరులు; పట్టాభిషేకం వారికే జరిపించండి; నేను వచ్చిన కారణం, యువరాజుమీద కత్తిదూసి ఓడించిన కారణం చెప్తున్నాను. అనాడు నేనంటే వారికి గలిగిన చులకన భావానికి ఆవేశపడి వచ్చాను; అంతేకానీ స్వార్థఫలాపేక్షతో కాదు" అన్నాడు వీరమల్లుడు.

మహారాజా మదన్‌సింగు వీరమల్లుని ఎంతగానో మెచ్చుకున్నాడు.

యువరాజా జగత్‌సింగు తన తెలివి తక్కువను గ్రహించాడు. "ఎదుటి వ్యక్తిని చులకన చేయడం ఎంత తెలివి తక్కువో గ్రహించాను; నన్ను క్షమించు" అని వీరమల్లుని రెండుచేతులూ పట్టుకుని వేడుకున్నాడు.

"మిమ్మల్ని క్షమించే అర్హత నాకులేదు; నేను మీ రాజ్యంలో, మీ పాలనలో బ్రతకవలసిన వాణ్ణి. నిజం గ్రహించిన మీదట ఒకరిని ఒకరు క్షమించాల్సిన పనిలేదు" అన్నాడు వీరమల్లుడు.

"మరో చిత్రం జరిగింది. మీ ఆస్థాన పండితులు వీరభద్ర పండితులు గురుద్రోహం చేశాడు; అతనికి తగిన ప్రాయశ్చిత్తం చేయడానికి ఆ గురువు పంటికంటి గుర్రంగా వచ్చాడు. శిష్యుడు చేసిన ద్రోహానికి చక్కని గుణపాఠం చెప్పి అవమానపరిచాడు; 'గురు ద్రోహం' ఎంతటి హీనమైనదో మీ ఆస్థానపండితులు యిప్పటికైనా తెల్సుకుని వుంటాడు."

బాలిక జగదీశ్వరి అని పరిచయం చేశాడు వీరమల్లుడు.

మహారాజా మదన్‌సింగు స్వహస్తాలమీద జగదీశ్వరి, వీరమల్లులకు వివాహం చేశాడు.

వీరమల్లుకు జయంతి నగర ఆస్థానపండితులలో అగ్రపీఠాన్ని అలంకరించి యీ నాటికీ చిరంజీవిగా వెలకట్టలేని విలువతో ప్రకాశిస్తున్నాడు.—

—: శుభం :—





